# ఆంధ్రపత్రిక

THE ANDHRA PATRIKA - MADRAS. సంపుటం 42. సంచిక 160 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO శుక్రవారం 9-9-1955 Reg. No. M. 1118 6 పేజీలు 1 అణా



# రాజధాని మార్పు ప్రసక్తి ఇక లేదని శ్రీ సంజీవరెడ్డి భావన

## అన్ని పక్షాలు ఇదే అభిప్రాయంతో ఉన్నవి

### విశాలాంధ్ర వెంటనే రాలేదని నిరుత్సాహ పడక ఆందోళన సాగించమని హితవు

విజయవాడ, సెప్టెంబరు 7: ఆంధ్రరాష్ట్ర ముఖ్య పట్టణం మార్పు ప్రసక్తి ఇక లేదు అని ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి స్పష్టంచేశారు.

రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సంఘం విశాలాంధ్ర ఏర్పాటుకు వ్యతిరేకంగా సిఫార్సు చేసినప్పటికీ కర్నూలు నుంచి ప్రభుత్వ కార్యాలయాలను మార్చటమనేది వుండదనీ, ఈ విషయంలో రాష్ట్రంలోని రాజకీయపక్షాలన్నీ ఒకే అభిప్రాయంతో ఉన్నవనీ ఆయన యీ రాత్రి పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ అన్నారు.

"ఆంధ్రుల అంతిమలక్ష్యం విశాలాంధ్ర. అది ఏర్పడటం కొంచెం ఆలస్యమయినా నిరుత్సాహం చెందరాదు. మహారాష్ట్రులు, మళయాళీలు కన్నడులు వారి వారి రాష్ట్రాలకోసం చేస్తున్నట్లే ఆంధ్రులుకూడా విశాలాంధ్ర కోసం ఆందోళన సాగించాలి. రాజధాని మార్పుకోసం ఆందోళన ఇకచాలించి, రాష్ట్ర అభివృద్ధి ప్రణాళికలకై శక్తియుక్తులు వినియోగించాలి" అనికూడా శ్రీ సంజీవరెడ్డి చెప్పారు.

#### 'బెజవాడకు నేను అడ్డుపడలేదు'

ఇదివరకు ముందు శ్రీ సంజీవరెడ్డి పురపాలకసంఘం సమర్పించిన పౌరసన్మాన పత్రానికి సమాధానమిస్తూ, విజయవాడను ఆంధ్రరాష్ట్ర ముఖ్యపట్నం చేయటానికి తాము అడ్డుపడ్డారనేది నిజంకాదన్నారు. తాత్కాలిక రాజధాని కర్నూలులో వుండాలని నిర్ణయించింది ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘమూ, ఆంధ్ర శాసనసభ్యులలో అధిక సంఖ్యాకులూనని అన్నారు. ఒకసారి నిర్ణయం చేసినతర్వాత తిరిగి ముఖ్యపట్టణాన్ని మార్చటాన్ని మాత్రమే తాము వ్యతిరేకించామన్నారు. కృష్ణపై రోడ్డు రెగ్యులేటర్ వంతెన రెండు సంవత్సరాలలో పూర్తికాగలదనీ, అప్పుడు గుంటూరు విజయవాడలు హైదరాబాదు సికింద్రాబాదులవలె జంటగా వృద్ధిచెందగలవనీ అన్నారు.

తాము మంత్రిగానే ఈ పట్నానికి ఇదివరలో చాలా సార్లు వచ్చామనీ, అయినా ఈ పురపాలక సంఘం తమకు పౌరసన్మానం చేయటం ఇదే మొదటిసారి అనీ, బహుశా ఇదివరకు ఇందుకు కాలం పరిపక్వం కాలేదు కాబోలునని కూడా శ్రీ సంజీవరెడ్డి అన్నారు.

పురపాలక సంఘాధ్యక్షుడు శ్రీ పోతిని గణపతిరావు పాత్రుడు స్వాగతపత్రం సమర్పించారు.

#### 'మనం తొందర పడరాదు'

#### కర్నూలులో ఉప ముఖ్య మంత్రి అభిభాషణ

కర్నూలు, సెప్టెంబరు 8: "విశాలాంధ్రలో చేరవలెనా లేక ప్రత్యేక తెలుగు రాష్ట్రంగా ఉండాలా అని నిర్ణయించుకోవలసినది తెలంగాణా ప్రజా ప్రతినిధులే. ఈ విషయమై మనము తొందరపడరాదు" అని ఉపముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారు,పత్రికా ప్రతినిధులతో చెప్పారు.

భాషారాష్ట్ర విచారణసంఘ నివేదికపై ఊహాగానాల విషయం వారిదృష్టికి తేగా యింకా యిలా అన్నారు. "నేను తెలంగాణా ప్రజాప్రతినిధులతో మాట్లాడాను. విశాలాంధ్ర కావాలని ఆంధ్ర ప్రజానీకము కోరుతున్న సంగతి అందరికీ తెలుసు. అయితే దాన్ని శాంతంగా, క్రమంగా తెలంగాణా నాయకుల సౌహార్దంతో సంపాదించవలసివున్నది."

#### వైద్య విద్యార్థిని ఉత్సాహం

గుంటూరు, సెప్టెంబర్ 8: కుమారి జి. సులోచన అనే గుంటూరు వైద్య విద్యార్థిని యెవ్వరికీ చెప్పకుండా, గోవా సత్యాగ్రహంలో పాల్గొనేందుకు రహస్యంగా వెళ్లిపోయిందని నేడు తెలియవచ్చింది.

ఈ అమ్మాయి కళాశాల అధికారులకుగానీ, తన తలిదండ్రులకుగానీ యీ విషయమేమీ తెలియజేయకుండా వసతి గృహంనుంచి మాయమయింది. శేపల్లెలో ఉన్న తన తలిదండ్రులను చూడాలని చెప్పి రెండు రోజులకింద వార్డెన్‌తో చెప్పిందట. అప్పుడామె కళాశాల అధికారుల సెలవు తీసికొని వెళ్ళమన్నదట. అప్పుడీమె తన సొమ్ములనూ, వస్తువులను గదిలోనే డ్రాయర్లో దాచిపెట్టి, తాను గోవా సత్యాగ్రహంలో పాల్గొనేందుకు వెడుతున్నానని ఒక ఉత్తరం వ్రాసి పెట్టి వెళ్లిపోయింది.

ఈ ఉత్తరంవల్ల ఈమె వెళ్లినసంగతి అందరికీ తెలిసినది. ఇంతకు ముందునుంచీ ఈమె గోవా పరిస్థితులను ప్రతిరోజూ తోటి విద్యార్థినులతో వాదిస్తూ వున్నదనీ, సత్యాగ్రహంలో పాల్గొనాలన్న అభిలాషను వెల్లడిస్తూ ఉండేదనీ తెలియవచ్చింది.

ఉత్తరం కనిపించగానే కళాశాల అధికారులు ఈ విషయాన్ని పోలీసులకూ, ఆ పిల్ల తలి దండ్రులకూ తెలియజేశారు.

లండనులోని భారత విద్యార్థి నిలయంలో భారతీయకళల, చేతిపరిశ్రమల ప్రదర్శనానికి లార్డ్ పెథిక్-లారెన్స్ ఇటీవల ప్రారంభోత్సవం జరిపారు.

పండిత జవహర్‌లాల్ నెహ్రూకు రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ "భారత రత్న" బిరుదు ప్రదానంచేసి సత్కరించారు, ఈ బిరుదు ప్రదానోత్సవం ఈనెల 7 వ తేదీన రాష్ట్రపతి భవన్‌లో జరిగింది.

## గ్రీకులపై టర్కీలో అల్లరి

### సైనిక శాసనం అమలు

ఇస్తాన్‌బుల్, సెప్టెంబరు 7: ఇస్తాన్‌బుల్, అంకారా, ఇజ్మిర్‌లలో గ్రీకులకు వ్యతిరేకంగా జరిగిన అల్లర్లను పురస్కరించుకొని టర్కీ ప్రభుత్వం ఈ మూడునగరాలలోను సైనిక శాసనాన్ని ప్రకటించింది.

ఈ అల్లర్లమూలంగా టర్కీలోవున్న గ్రీకులు అమితమైన కష్టనష్టాలకు గురికావటంపట్ల ప్రభుత్వం విచారాన్ని వెల్లడించడమేగాక, ఈ అల్లర్లను కమ్యూనిస్టులు లేవదీశారని ప్రకటించింది. గ్రీక్ ప్రభుత్వం ఈ అల్లర్లపై టర్కీకి తీవ్ర అధిక్షేపణను తెలియజేసింది. టర్కీ, గ్రీసు సరిహద్దులకు దగ్గరగా వున్న థ్రేస్ రాష్ట్రంలో శాంతిభద్రతలను కాపాడడానికి సైన్యాలను నియమించి టర్కీకి వ్యతిరేకంగా ప్రదర్శనలు, అల్లర్లు ప్రారంభంకాకుండా తగు కట్టుదిట్టాలుగూడా చేసింది. టర్కీలో జరిగిన అల్లర్లలో టర్కీవారు గ్రీకు చర్చిలను దుకాణాలను దోచుకున్నారు. ఇళ్లు కొల్లగొట్టారు. అల్లరిమూకలు గల్లంతుచేస్తూ "సైప్రెస్ టర్కీదే" అని నినాదాలు చేశారు.

లండన్‌లో గ్రీసు, టర్కీ, బ్రిటన్ల మధ్య సైప్రెస్‌పై జరుగుతున్న సమాలోచనలు ఆగిపోయినాయి. బ్రిటన్ చేసిన ప్రతిపాదనలు పత్రికల ప్రకటనార్థం జారీకానున్నాయి. కానీ ఈ సంప్రతింపులు ఇట్లా ఆగిపోవడానికి టర్కీదే బాధ్యత అని సమితిలోని గ్రీకు శాశ్వత ప్రతినిధి క్రిస్టియన్ పాలమాస్ ఒక ప్రకటనచేశారు.

## ఒరిస్సా వరదలలో 5 కుటుంబాలు ఆహుతి

### దారితెన్నులేక ప్రజల అవస్థ: భారీ ఎత్తున రక్షణ చర్యలు

కటక్, సెప్టెంబరు 7: బ్రాహ్మణినది వరదలలో గోపాల్‌పూర్ గ్రామంలో 5 కుటుంబాలు మొత్తం కొట్టుకు పోయినట్లు అధికారవర్గాలవారు నేడు చెప్పారు. తల్‌చేరులో ఒక ఏడేళ్ల పిల్లవాడు, పూరిజిల్లాలోని బండపారాలో మరొక వ్యక్తి నీటమునిగి చనిపోయారని వార్తలు వచ్చాయి.

రాష్ట్రంలోని పెద్దనదులన్నీ పొంగి ఉన్నాయని వేలాది ప్రజలు నిరాశ్రయులైరనీ, వివరాలు సేకరిస్తున్నామనీ రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. ఏడుగురు చనిపోయారనీ, 8 గురు కన్పించడం లేదనీకూడ యీ ప్రకటనలో పేర్కొన్నారు.

వరదలలో చిక్కుకుపోయిన 8 లక్షలమంది ప్రజలను సురక్షిత ప్రాంతాలకు తరలించేందుకు భారీ ఎత్తున చర్యలు ప్రారంభమైనాయి. పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం, కలకత్తాలోని సైనికాధికారులు పంపిన పడవలు మోటారుబోట్లు, ఇవ్వాళ ప్రత్యేక రైలులో వచ్చాయి.

పూరీ, బాలసూర్, కటక్, జిల్లాలలో వరదల ఉధృతం తగ్గడంలేదని వార్తలువచ్చాయి.

#### ఆర్తులు

పడవలద్వారాకూడా చేరడానికి వీలుపడని ప్రాంతాలలో చిక్కుకుపోయిన ప్రజలకు నేడు విమానాల ద్వారా ఆహారపదార్థాలు విసరివేశారు. ముఖ్యమంత్రి నేడు విమానంలో

(5 వ పేజీ చూడుడు)

## ముందుగా అక్రమపాలన రద్దు అయిపోవాలి

### మొరాకో నాయకుల హెచ్చరిక

రోమ్, సెప్టెంబర్ 7: మొరాకోకు శాసనాధికారాలను ఇచ్చి, 1953 నుంచి కొనసాగుతున్న అక్రమ పరిపాలనను రద్దుచేస్తేనేగాని మొరాకో ఫ్రాన్సులమధ్య రాజకీయ సమాలోచనలు జరిగి జయప్రదం కావడం అసాధ్యమని ఇస్తిక్‌లాల్ పార్టీ నేడు ఒక ప్రకటన చేసింది. రెండు రోజులు వీరు రహస్యంగా

(5 వ పేజీ చూడుడు)

## కంపెనీల అజమాయిషీకి ప్రత్యేకసంస్థ ఉండదు

### ప్రభుత్వం తన అధికారాలను వదులుకోదని మంత్రి ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: కంపెనీల శాసనాన్ని అమలు జరిపేటందుకు వేరే ఒక సంస్థను శాసనరీత్యా ఏర్పాటు చేయటానికి వీలులేదని ఆర్థిక మంత్రి శ్రీ దేశముఖ్ ఇవ్వాళ లోక్ సభలో కచ్చితంగా చెప్పేశారు. ఆర్థిక, పారిశ్రామిక విధానానికి సంబంధించిన వ్యవహారాలలో పార్లమెంటు అభిమతాలను వ్యక్తంచేసే అధికారాన్ని ప్రభుత్వం వదులుకోజాలదన్నారు.

ఇట్లా ఒక ప్రత్యేక సంస్థను ఏర్పాటు చేయాలనీ, అంతేగాని ఈ శాసనం అమలును ప్రభుత్వ ఉద్యోగుల సమూహానికి వ్యాలకు వదలిపెట్టరాదనీ శ్రీ ఎన్. సి. ఛటర్జీ ఇవ్వాళ కంపెనీలచట్టంపై చర్చలో అన్నారు. ఇందు నిమిత్తం ఆయన ఒక సవరణ ఉపపాదించారు. శ్రీ వి. రామచంద్రారెడ్డి, శ్రీ ఛటర్జీ సూచించినటువంటి సంస్థను ఏర్పర్చటానికి తాము వ్యతిరేకం కాదనీ, అయితే ప్రస్తుతానికి ప్రభుత్వం నియామకంచేసే సంస్థతో తాము తృప్తిపడతామనీ అన్నారు. శ్రీ కె. పి. త్రిపాఠీ, కంపెనీల డైరెక్టర్ల బోర్డులలో ఉద్యోగుల ప్రతినిధులు ఇద్దరిద్దరూ ఉండాలని ఒకటీ, కంపెనీలు చేతులు మారినప్పుడు పనివారి ఉద్యోగ పరిస్థితులు మారకుండా చేసే అధికారం ప్రభుత్వానికి ఉండాలని ఇంకొకటీ రెండు సవరణలు ఉపపాదించారు. శ్రీ ఎం. ఎస్. గురు

(5 వ పేజీ చూడుడు)

# చేనేత వస్త్రాల విక్రయంపై ముదరా కొనసాగించాలి

## గుంటూరు జిల్లా చేనేత వస్త్ర వ్యాపారుల అభ్యర్థన

గుంటూరు, సెప్టెంబరు 6: చేనేత సహకార సంఘాల ద్వారాకంటె యీ సంఘాల్లో చేరని చేనేత వస్త్ర వ్యాపారుల సంఖ్య చాలా ఎక్కువగా వుండటమే గాక, వీరిద్వారానే యీ వస్త్రాల వ్యాపారం ఎక్కువగా సాగుతోంది కాబట్టి, సహకార సంఘాలకు చేనేత వస్త్రాల అమ్మకంపై ఇస్తున్న ముదరాను, యీ వ్యాపారులకు కూడ లభింప చేయాలని ప్రభుత్వాన్ని కోరుతూ చిన్న వరదయ్యగారి పొగాకు కంపెనీ ఆవరణలో జరిగిన జిల్లా చేనేత వస్త్ర వ్యాపారుల మహాసభలో తీర్మానించారు. సుమారు 100 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. శ్రీ మునగాల మంగయ్య అధ్యక్షత వహించారు.

శ్రీ గోపాలరావు ప్రార్థన గీతం పాడారు. శ్రీ మున్నలూరి లక్ష్మీనారాయణ స్వాగతమిస్తూ ముదరా పథకం క్రింద ఆంధ్ర రాష్ట్రానికి రు 10 లక్షలు కేటాయించగా, అందులో చేనేత సహకార సంఘాలకు రు 8 లక్షలు కేటాయించి చేనేత వ్యాపారులకు రు 2 లక్షలు మాత్రమే కేటాయించడం అన్యాయమన్నారు.

"జిల్లాలో సహకార సంఘాల వెలుపల 86 వేల మగ్గాలు సంఘాలలో 11 వేల మగ్గాలు మాత్రమే పని చేస్తున్నాయి. కనుక ముదరా పథకం క్రింద కేటాయించిన మొత్తాలు సరిగా లేవు. వీటిని సరిదిద్దవలసిన అవసరం వున్నది." అని చెప్పారు.

### సహకార పద్ధతి శ్రేయస్కరం

శ్రీ ప్రగడ కోటయ్య తమ ప్రారంభోపన్యాసంలో ఇలా అన్నారు: "సహకార పద్ధతిలో యీ పరిశ్రమను నిర్వహించడంలో మన రాష్ట్రం ఎంతో ముందుకు వెళ్ళింది. వ్యక్తులు యీ వ్యాపారాన్ని నిర్వహించడానికీ, సహకార సంఘాలు నిర్వహించడానికీ, ఎంతో భేదం వున్నది. గ్రామ పరిశ్రమలకు ద్వితీయ ప్రణాళికా కాలంలో రక్షణ ఇవ్వాలని ప్రభుత్వం నిశ్చయించింది. సుమారు కోట్లం క్రితం 6 కోట్ల చేనేత పారిశ్రామికులు 60 లక్షల మగ్గాలమీద పని చేస్తుండేవారు. కాని ఇప్పుడు 80 లక్షల మగ్గాలు వాడుకలో వున్నాయి. వీటిమీద ఆధారపడేది 2 కోట్ల మంది. 400 బట్టల మిల్లుల నిర్మాణంలో యీ నిరుద్యోగం సంభవించింది. 1960 నాటికి 820 కోట్ల గజాల గుడ్డ సాలీనా తయారు చేయాలని ప్రభుత్వ అంచెనా. వ్యక్తికి సంవత్సరానికి సగటున 22 గజాలగుడ్డ వంతున మొత్తం దేశానికి అవసరమయ్యే 1000 కోట్ల గజాల గుడ్డలోను మిల్లులు తయారు చేసే 500 కోట్లు మినహా, తక్కినది చేనేత మగ్గాలు తయారు చేయడానికి సిద్ధంగా వున్నాయి. చేనేత వస్త్రాల ప్రమాణం పడిపోకుండా జాగ్రత్త వహించాలి పరిశ్రమలోను, వ్యాపారంలో అవినీతి, అక్రమం లేకుండా చూసుకోవాలి."

### ముదరా విధానం అవసరం

శ్రీ మునగాల మంగయ్య ప్రసంగిస్తూ, ముదరా పథకం క్రింద ఈ జిల్లా వ్యాపారస్థులందరికీ కలిపి 65 వేలు మాత్రమే కేటాయించడం, పైపెచ్చు ఆగస్టు 19 నుంచి ఆ పద్ధతిని నిలిపివేయడం చాలా అన్యాయమన్నారు. సహకార సంఘాల వెలుపలవున్న వేలాది చిన్న వ్యాపారస్థులను విస్మరిస్తే, వర్తకులకోసం వీరిపై ఆధారపడివున్న లక్షలాది చేనేత పారిశ్రామికులకు కూడ కష్టంరాగలదన్నారు. ముదరా విధానం ప్రారంభించాలని కోరారు.

జిల్లా చేనేత కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ అక్కల కోటయ్య మాట్లాడుతూ, చేనేత పరిశ్రమకు తగినరక్షణ ఉంటే ఆ వ్యాపారులకు సైతం ప్రయోజనాలు చేకూరగలవన్నారు. బట్టల మిల్లుల నుంచి ఈ పరిశ్రమను రక్షించుటకే సహకార సంఘాల ఆశయం కాని చేనేత వస్త్ర వ్యాపారులతో పోటీచేయుటం మాత్రం కాదన్నారు.

శ్రీ టి. శ్రీకంఠం అంబర్ చర్ఖా పుట్టుపూర్వోత్తరాలు వివరించారు.

### సగం ఉత్పత్తి చేనేతకివ్వాలి

క్రింది తీర్మానాలు ఆమోదించారు: భారత ప్రభుత్వం ద్వితీయ ప్రణాళికా కాలంలో ఉత్పత్తిచేయించ దలచుకున్న గుడ్డలో సగం మిల్లుల ద్వారాను, తక్కినసగం చేనేత పరిశ్రమ ద్వారాను, ఉత్పత్తి చేయించాలి. చిన్న తరహాయంత్రాలు విరివిగా స్థాపించి నూలుకోసం మిల్లులపై ఆధారపడకుండా చేనేత పారిశ్రామికులకు రక్షణ యివ్వాలి. సహకార సంఘాల కిచ్చే సౌకర్యాలు, ప్రయోజనాలు ఇతర చేనేతవస్త్ర వ్యాపారులందరికీ యివ్వాలి. చేనేత వస్త్రాలను ఏవ్యాపారులు విక్రయించినా అమ్మకం పన్ను విధించరాదు.

కార్యదర్శి శ్రీ గుర్రం వెంకట సుబ్బారావుగారు వందన సమర్పణ చేశారు.

జిల్లా చేనేత వస్త్ర వ్యాపారుల సంఘానికి దిగువ కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు. అధ్యక్షులు-శ్రీ మునగాల మంగయ్య, ఉపాధ్యక్షులు- శాకం సుబ్బారావు, చేబ్రోలు సుబ్బారావు గారలు. ప్రధాన కార్యదర్శి-శ్రీ గుర్రం వెంకటసుబ్బారావు, సహాయ కార్యదర్శులు. చుండూరి రామస్వామి, జొన్నాదుల రామారావు గారలు. సభ్యులు-శ్రీయుతులు మాచర్ల సీతారామయ్య కొల్లపూడి వెంకటరత్నం, శిరందాసు సాంబయ్య, జంకా రామయ్య, పచ్చారు ఆదిశేషయ్య, గోని అమరలింగం, దూబాసు సవరయ్య, తాడివర్తి సీతయ్య, మున్నలూరి లక్ష్మీనారాయణ.

(స్వ. వి.)

## సత్యాగ్రహంలో మరణించినవారు

### కుటుంబానికి సహాయం చేసే ఆలోచన లేదు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: గోవా స్వాతంత్ర్య సమరంలో ఆత్మార్పణ చేసిన సత్యాగ్రహుల కుటుంబాలకు ఆర్థిక సహాయంచేసే విషయం ప్రభుత్వ పరిశీలనలో లేదని విదేశాంగశాఖ ఉపమంత్రి అనిల్ కుమార్ చాందా ఇవాళ రాజ్యసభలో చెప్పారు. అనధికార సంస్థలు ఇలాంటి సహాయ కార్యక్రమాలకు పూనుకొంటున్నట్లు తెలిసిందని ఆయన చెప్పారు.

ఈ సందర్భంలో ప్రధాని నెహ్రూ అనుబంధ ప్రశ్నలకు జవాబు చెబుతూ మామూలుగా ఇటువంటి సందర్భాలలో ప్రభుత్వాలు సహాయం చేయవనీ, ప్రత్యేక పరిస్థితులలోఅయినా, ప్రధాని పేరిట నెలకొల్పే జాతీయనిధినుండి సహాయం మంజూరు చేస్తారనీ వివరించారు.

కొన్ని రాష్ట్రప్రభుత్వాలు రాజకీయ బాధితులకు ఆర్థిక సహాయం చేస్తున్నవి కదా అని ఒక సభ్యుడు అనగా, కేంద్ర ప్రభుత్వం అలాటి సహాయం ఎన్నడూ ప్రత్యక్షంగా చేయలేదని, తమ అభిప్రాయంప్రకారం ఈ పద్ధతి సముచితమైనదనీ ప్రధాని అన్నారు. అయితే, దీనికి తిరుగు లేదన్నట్టుగా ఆదేశించడం తమకు ఇష్టం లేదన్నారు.

### 1954 లో వజ్రాల ఉత్పత్తి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: 1954 వ సంవత్సరంలో భారతదేశం 18 వందల రతుల వజ్రాలు ఉత్పత్తి చేసిందనీ వీటి విలువ 8 లక్షల 8 వేల రూపాయలనీ సహజసంపదల శాఖామంత్రి లోకసభలో డి. సి. శర్మ అడిగినప్రశ్నకు లిఖితపూర్వకంగా సమాధానం ఇచ్చారు.

### రష్యా అణుశక్తి యంత్రాగారం

మాస్కో, సెప్టెంబరు 6: మాస్కో సమీపంలో నిర్మించిన అణుశక్తి యంత్రాగారం చూడడానికి రావలసిందని రష్యాప్రభుత్వం విదేశీయ రాయబార వర్గాలవారిని ఆహ్వానించింది.

### హైదరాబాదు పరిశ్రమల ఆర్థికసహాయసంస్థ

హైదరాబాద్, సెప్టెంబరు 6: హైదరాబాదులో రాష్ట్ర పరిశ్రమల ఆర్థికసహాయ సంఘానికి శ్రీ జగన్మోహనలాల్ చౌదరీని మేనేజింగ్ డైరక్టరుగా నియమించారు.

సాల్వంచ తాలూకా సుజాత్ నగర్ పంచాయతీ సభ్యుడు, ఘరానా దొంగ అయిన సీతారామయ్య, అతడి 'ప్రియురాలు' మంగమ్మ ఈ ఇద్దరినీ హైదరాబాద్‌లో పోలీసులు ఇటీవల అరెస్టు చేశారు. ఈ సీతారామయ్య పన్నెండేళ్ల క్రితం రాజమండ్రి జైలునుండి పారిపోయాడు. అప్పట్లో అక్కడ జైలువార్డర్‌గా పనిచేస్తున్న మంగమ్మ ఇతడిని ప్రేమించి, కూడా వెళ్లింది.



పి. నారాయణరెడ్డిగారు తాము రచియించిన 'నాగార్జున సాగర్' ఖండ కావ్యాన్ని గానంచేసి, ఆంధ్ర ముఖ్యమంత్రి ప్రభృతులకు వినిపించారు.



తెలంగాణా రచయిత శ్రీ దాశరథి రచించిన "మహాంధ్రోదయం" అను ఖండకావ్య సంపుటిని ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ఆవిష్కరించారు.

# వరద బాధితులకు ప్రభుత్వం సహాయం చేస్తుంది

## ప్రజాహిత సంస్థలు ఉదారులు కూడా తగు కృషిచేయాలని మంత్రి విన్నపం

తాడేపల్లిగూడెం, సెప్టెంబరు 6: వరద బాధితులకు ప్రభుత్వం అన్ని విధాలా సహాయం చేస్తుందనీ, ఈ సమయంలో ప్రజాసంస్థలూ, ఉదారులూ సాధ్యమైనంత సహాయం చేయాలనీ రెవెన్యూ మంత్రి కల్లూరి చంద్రమౌళి గారు విజ్ఞప్తిచేశారు.

పశ్చిమగోదావరి జిల్లా రైతు సంఘం సమర్పించిన వినతిపత్రానికి సమాధానం చెబుతూ, ఎర్రకాలువ ముంపు నివారణ పథకం విషయం ప్రభుత్వం ఆలోచిస్తున్నదని మంత్రి అన్నారు. ఏడు వేల రూపాయల ఖర్చుకు మించని పనులు మాత్రమే ప్రజాసంస్థలకు ఒప్పగించడం సాధ్యమవుతుందని తెలియజెప్పారు.

చంద్రమౌళిగారు అనంతపల్లి వంతెన వద్ద జి. టి. రోడ్డుకు గండ్లు పడ్డ స్థలాలను చూచారు. మంత్రి వెళ్లిన ప్రతిచోటా వరదబాధితులు తమ కష్టాలు చెప్పుకుని సహాయం చేయాలని విజ్ఞప్తి చేశారు. రెవెన్యూ బోర్డు సభ్యుడు శ్రీ ఉన్నితన్ శాసన సభ్యులు మూర్తిరాజు అల్లూరి బాపినీడు గారలు, వీరమాచనేని వెంకటనారాయణగారు, జిల్లా కలెక్టరు శ్రీ యం. ఆర్. పాయ్, తహశీల్దార్ శ్రీ యస్. టి. ప్రసాదరావు మంత్రి వెంట ఉన్నారు.

### 33 వేల ఎకరాల ముంపు

రైతుసంఘం వినతిపత్రంలో ఇలా వివరించారు. ఎర్రకాల్వ ఎనముద్రు మురుగు కాల్వ మొదలైనవాటికి వరద వచ్చినందువల్ల ఈ జిల్లాలో మొత్తం 32,858 ఎకరాలు మునిగిపోయాయి. రూ 244 వేలు చేసే ఇళ్లుకూలిపోయాయి. 87 పంట చెరువులకు గండ్లు పడినందువల్ల రూ 687 వేలు చేసే పంట నష్టమైనది. సుమారు రూ. 3000 చేసే పశువులు చనిపోయాయి.

ఎర్రకాలువ ఆయకట్టు క్రింద 11 వేల ఎకరాల ఆయకట్టులోని వరి పంట మునిగిపోయింది. అనేకచోట్లగండ్లుపడి, చేలలో ఇసుక మేట వేసింది. డెల్టా ప్రాంతంలో ఎనముద్రు మురుగు కాలువ పొంగినందువల్ల 14 చతురపు మైళ్ళ పంటభూమి మునిగిపోయింది.

### ఎర్రకాలువకు 4 డాములు

ఇప్పుడు ఎర్రకాలువ ప్రాజెక్టు నిర్మిస్తే, ప్రస్తుతం సాగుఅవుతున్న 11 వేలు కాక, మరో 35 వేల ఎకరాలు సాగు క్రిందకు వస్తుంది. రెండవపంటకుకూడా 11 వేల ఎకరాలకు నీరు సరఫరాచేయడం సాధ్యం కావాలంటే, ఎర్రకాలువకు పులిపాడు, బైనేరు, జల్లేరు, ఎర్రకాల్వ అనే నాలుగుచోట్ల డాములు నిర్మించాలి. వీటికి పథకాలు సిద్ధమైనవి. ఇవి నిర్మించి శాశ్వతమైన ఏర్పాట్లు చేస్తే, ఏటేటా వరదలవల్ల విధ్వంసం తప్పుతుంది.

ప్రస్తుతం వరదల మూలంగా నష్టపడిన రైతులకు అప్పులు మంజూరుచేయడం, గండ్లుపడ్డ చెరువులకు గండ్లు పూడ్పించి మరమ్మతులు చేయడం మొదలైన పనులు వెంటనే జరిపించాలి.

### దువ్వ ప్రాంతంలో బసంగి ధ్వంసం

రెవిన్యూమంత్రి నిన్న దువ్వ గ్రామం వద్ద ఎర్రకాలువ దెబ్బతిన్న ప్రాంతం చూచారు. ఈ ప్రాంతంలో ముంపు దెబ్బతిన్న ఆరు గ్రామాలలోనూ రు. 8 వేలు చేసే వరిపంట దెబ్బతిన్నదనీ, అందులో 2500ఎకరాలలో బసంగిపంట పూర్తిగా పాడైపోయిందనీ, పసగ్రాసం ధ్వంసమైనదనీ కాంగ్రెసు కార్యకర్త శ్రీ కర్లపూడి సత్యనారాయణ విన్నవించారు.

కొండేపాడు, మినపల్లూరు, కోరుమిల్లి గ్రామస్థులు కూడా మంత్రికి తమకష్టాలు చెప్పుకున్నారు.

ఉపన్యాసాల కిది సమయంకాదనీ, నష్టపడ్డ ప్రాంతాలుచూచి, తక్షణసహాయం చేయడానికి వచ్చామనీ మంత్రి జవాబిచ్చారు.

వరిఘేడు, తిరుపతిపురం, ఖల్లిపాడు గ్రామాలకు మంత్రి నావపైవెళ్లి వరదవల్ల వాటిల్లినష్టాన్ని చూశారు. ఆత్తిలి పడింపల్లి తిరుపతిరాజు నష్టాన్ని వివరించారు.

### సోమతు కలవారు సహాయం చేయాలి

చంద్రమౌళిగారు 6 వ తేదీ ఉదయం తణుకువచ్చి కేశవస్వామి ఆలయాన్ని సందర్శించారు. దేవస్థానం అధికారులు ఆలయ మర్యాదలతో స్వాగతమిచ్చారు.

అనంతరం, బాపినీడుగారి అధ్యక్షతన పట్టణకాంగ్రెసు కార్యాలయంవద్ద జరిగిన బహిరంగసభలో పట్టణ కాంగ్రెసు తరఫున శ్రీ తోట సుబ్బారావు తాలూకా కాంగ్రెసు తరఫున శ్రీ ఇవటూరి వీరభద్రం వినతిపత్రాలు సమర్పించారు. స్తోమతి గలవారంతా వరదలవల్ల నష్టపడినవారికి సహాయం చేయాలని చంద్రమౌళిగారు ఈ సభలో ఉద్బోధించారు. గ్రామసీమలలో, బస్తీలలో సమష్టి ఉపయోగానికి తలపెట్టే నిర్మాణ కార్యక్రమాలలో పార్టీభేదాలు లేకుండా అందరూ పాల్గొనాలని ఆయన చెప్పారు.

రాజకీయ బాధితుల వ్యవహారం ఒకటి రెండు నెలలో పరిష్కారమవుతుందని చెప్పారు.

### చిత్రపటాల ఆవిష్కరణ

తిరువాత చంద్రమౌళిగారు కాంగ్రెసు కార్యాలయంలో గాంధీజీ, పండిత నెహ్రూ, డా॥ రాజేంద్రప్రసాద్ ల చిత్రపటాలను ఆవిష్కరించి పుష్పమాలలు వేశారు.

### అత్తిలిలో వరద బాధితులకు సహాయం

అత్తిలి, సెప్టెంబరు 6: శ్రీమతి అమ్మన్నరాజా, శ్రీ పడింపల్లి తిరుపతిరాజు యీ గ్రామంలో బియ్యపువర్తకులవద్ద బియ్యం సేకరించి, వరదబాధితుల కుటుంబాలకు రెండేసి శేర్ల బియ్యం పంచిపెట్టారు. స్వ. వి.

## మద్రాసులోవున్న ఆంధ్రకార్యాలయాలు

### రాష్ట్రంలో ఉత్తరువులు జారీచేయడంపై దావా

గుంటూరు, సెప్టెంబరు 6: పేటపాలెం పంచాయతీబోర్డు అధ్యక్షుడు పి. సాంబయ్యగారిని పదవినుంచి తొలగిస్తూ మద్రాసులోఉన్న ఆంధ్రరాష్ట్ర స్థానిక పరిపాలనాశాఖ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఇచ్చిన ఉత్తరువులను అమలు జరపవద్దని ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ ఎన్. డి. కృష్ణారావు తాత్కాలిక ఉత్తరువులు ఇచ్చారు.

మద్రాసులో ఉంటున్న ఆంధ్ర ప్రభుత్వ స్థానిక పరిపాలనా శాఖ ఇన్‌స్పెక్టరు జనరల్ కు తనను పదవినుంచి తొలగించే అధికారం లేదని, స్థానిక పరిపాలన, విద్య, వైద్యశాఖల కార్యదర్శి మీదనూ, స్థానికసంస్థలఇన్‌స్పెక్టర్ జనరల్ మీదనూ సాంబయ్యగారు పెట్టుకొన్న దరఖాస్తును న్యాయమూర్తి దాఖలుచేసుకొని స్థానికసంస్థల ఇన్‌స్పెక్టరు జనరల్ ఉత్తరువులను అమలు జరపవద్దని పైవిధంగా ఉత్తరువులిచ్చారు.

దరఖాస్తుదారు తరఫున శ్రీయుతులు టి. లక్ష్మయ్య, కె. శ్రీనివాసమూర్తి, టి. భుజంగభూషణం గారలు పనిచేశారు.

# పల్లా దుర్గయ్యకు సన్మానం

## తెలంగాణా రచయితల సంఘం

హైదరాబాదు, సెప్టెంబరు 7: పద్మవిభూషణ మాడపాటి హనుమంతరావు గారి అధ్యక్షతన తెలంగాణా రచయితల సంఘం కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో పల్లా దుర్గయ్య గారికి కవి సన్మానం చేశారు. ఈ సమావేశానికి కాళోజీ నారాయణరావు, ఖండవల్లి లక్ష్మీరంజనం, దివాకర్ల వెంకటావధాని, కురుగంటి సీతారామయ్య, డాక్టరు పి. వి. రమణయ్య మొదలైన ప్రముఖులనేకులువచ్చారు.

శ్రీ దాశరథి సభ్యులకు స్వాగతం చెబుతూ, దుర్గయ్యగారు చక్కని భాషా వైదుష్యంతో ఉత్తమ కవిత్వం చెప్పే వారిలో ఒకరనీ వారిని సన్మానించడం తెలంగాణా రచయితల సంఘానికి గౌరవమనీ అన్నారు. పిమ్మట సి. నారాయణరెడ్డిగారు, దుర్గయ్యగారి 'పాలవెల్లి' అనే ఖండకావ్య సంపుటికి, విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసిన పీఠిక చదివి వినిపించారు. మాడపాటి హనుమంతరావుగారు, శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, శ్రీ బి. రామరాజు దుర్గయ్యగారి కవితా నైపుణిని ప్రత్యేకతను ప్రశంసించారు. అనంతరం చందన తాంబూలాలతోను, పట్టువస్త్రాలతోను దుర్గయ్యగారికి సత్కారం జరిగింది. నగర కళాశాలల పూర్వ ప్రస్తుత విద్యార్థి సంఘాలు పుష్పమాలికలతో గౌరవించారు. దుర్గయ్యగారు తమకు జరిగిన సన్మానానికి కృతజ్ఞత తెలియజేస్తూ తాము రచించిన కొన్ని ఖండ కావ్యాలు చదివి వినిపించారు.

అటు పిమ్మట తెలంగాణా రచయితల సంఘం నిర్వహించిన కవితా రచన పోటీలో ప్రథమ, ద్వితీయ, తృతీయ శ్రేణులలో గెలిచిన తెన్నేటి పూర్ణచంద్రరావు, సుప్రసన్న, మల్లికార్జున్ గార్లకు సభాధ్యక్షులు క్రమంగా 50, 30, 20 రూపాయల బహుమతులిచ్చి సత్కరించారు. బహుమతులు పొందిన రచయితలు తాము పోటీకి పంపించిన రచనలు గానం చేశారు. ఇరివెంటి కృష్ణమూర్తిగారి వందన సమర్పణతో సభ ముగిసింది.

బెంగుళూరు, సెప్టెంబరు 6: ఢిల్లీలో ప్లానింగు కమిషను సమావేశంలోను, జాతీయాభివృద్ధి మండలి సమావేశంలోను, పాల్గొని మైసూరు ముఖ్యమంత్రి కె. హనుమంతయ్యగారు రేపటి బెంగుళూరు వచ్చారు.

# ఆంధ్రనుండి మిర్చి ఎగుమతి

విజయవాడ, సెప్టెంబరు 6: విజయవాడ అపరాల వర్తకసంఘ కార్యదర్శి వేముల అప్పయ్యగారిలా వ్రాస్తున్నారు.

ఆంధ్రలో యీ యేడు మిర్చిపంట అధికంగా పండడంచేత, యిదివరకటి పంటకూడా ఎక్కువగా నిల్వఉండడంచేత, ఎగుమతి కోటా పెంచాలని, చిన్న వర్తకులు కూడా యీ వ్యాపారంలో పాల్గొనుటకు వీలుగా టన్నొకటికి రు. 50 వేలకు తగ్గించాలని మేము విజ్ఞప్తి పంపుకొన్నాము. పార్లమెంటు సభ్యుడు శ్రీ కొత్త రఘురామయ్య, ప్రత్యేక శ్రద్ధవహించి మా యీ విజ్ఞప్తిని వాణిజ్యశాఖా మంత్రి టి. టి. కృష్ణమాచారిగారి దృష్టికి, ఆ శాఖకు చెందిన ఉన్నతోద్యోగులదృష్టికి తెచ్చి, విజ్ఞప్తిలోని రెండు సూచనలను వారిచే ఒప్పించారు. మా పక్షాన మా క్షేమ లాభాలకోసం కృషి చేసిన రఘురామయ్యగారికి, విజయవాడ అపరాల వర్తకసంఘం కృతజ్ఞత తెలుపుకొంటున్నది.

## గంటల పంచాంగం

శ్రీ మన్మథనం॥ అధిక భాద్ర॥ బ॥ అష్టమి 1955 - సం॥ సెప్టెంబరు 9 శుక్రవారం శు॥ అష్టమి 24-27రో హి-14-40 వర్జ్యం 7 6 ల 8-37 వ. వర్జ్యం 19-57 ల 21-28 వ. శ్రీ కృష్ణజయంతి.

బ॥ నవమి సెప్టెంబరు 10 శనివారం శు॥ నవమి 22-21 మృగ 18-20 వర్జ్యం 21-15 ల 22-45.

ఆంధ్రపత్రిక

(మహాభారతము)

శ్రీమన్మథ సం॥ అధిక భాద్ర॥ బ॥ అష్టమి
శుక్రవారం

## ప్రభుత్వ 'గోవా విధానం'

పోర్చుగీసు స్థావరాల విషయంలో అఖిలభారత కాంగ్రెస్ సంఘం చేసిన తీర్మానంమీద తీవ్ర విమర్శలు ప్రారంభమైనవి. కమ్యూనిస్టు, ప్రజా ...

... గ్రహానికి నిముఖులు కావడానికి కారణం సత్యాగ్రహ నిర్వహణ విధానం కాదు; సత్యాగ్రహ శక్తి, ప్రయోజనాల్లో వారికి విశ్వాసం తగ్గడం కారణంగాదు. పోర్చుగీసు సైనికులు సత్యాగ్రహులపై జరిపిన కిరాతకచర్యల దృష్ట్యా, పరిస్థితులను పునరాలోచించవలసిన అవసరం ఏర్పడింది. అఖిలపక్ష గోవా విమోచన సంఘంకూడా ఆగస్టు 15న సత్యాగ్రహులపై పోర్చుగీసు సైనికులు జరిపిన కాల్పుల వివరాలు తెలుసుకొని, పరిస్థితులను పునర్విచారణ చేసేవరకూ సత్యాగ్రహాన్ని ఆపివేయడం అవసరమని భావించెను కదా! పోర్చుగీసు స్థావరాల విమోచనకు ప్రత్యక్ష పోరాటం వినా మార్గం లేదని భారత ప్రభుత్వము, అఖిల భారత కాంగ్రెస్ సంఘం అభిప్రాయపడితే ఆ పోరాట నిర్వహణకు, తత్సంబంధమైన సత్యాగ్రహాన్ని సాగించడానికి అవసరమైన సహాయం చేయవచ్చును. కాంగ్రెస్ సంఘమే ఆ ఉద్యమాన్ని నిర్వహించవచ్చును.

భారత ప్రభుత్వము, అఖిల భారత కాంగ్రెస్ సంఘము అనుసరించదలచిన విధానాలు ...

## పౌరసత్వం బిల్లు

### రాజ్యసభలో చర్చ

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 7: పౌరసత్వం బిల్లును పార్లమెంటు సమిష్టి పరిశీలన సంఘానికి నివేదించాలని జేశీయాంగ మంత్రి పండిత పంత్ చేసిన ప్రతిపాదనపై రాజ్యసభ నేడు చర్చ ప్రారంభించింది. ఈ బిల్లు దేశంలోని ప్రతి ఒక్కరికీ సంబంధించిందనీ, ఈ జాతీయ సమస్యమీద ఆవేశరహితంగా సభ్యులు చర్చించాలనీ శ్రీ పంత్ హెచ్చరించారు. సభికులు మొత్తంమీద బిల్లును సమర్థించినప్పటికీ కామన్వెల్తు పౌరసత్వానికి సంబంధించిన అంశాలనూ, పౌరసత్వాన్ని రద్దుచేసేందుకు యేర్పాటు చేసిన సూత్రాలను మాత్రం కొందరు నిశితంగా విమర్శించారు.

"నిస్సందేహంగా భారత పౌరులైన వాళ్ల హోదాను క్రమబద్ధం చేయటమే కాక, ప్రస్తుత రాజ్యాంగం అమలులోకి వచ్చిన తరవాత దేశ భద్రతమైన ఇక్కడికి వచ్చినవాళ్ల హోదానుకూడా ఈ బిల్లు క్రమబద్ధం చేస్తున్నది. ఈ బిల్లు ప్రకారం పౌరత్వం లభించటానికి ...

### కామన్వెల్తు పౌరసత్వం

### పౌరహక్కుల తొలగింపు

### భారత దేశానికి బుల్గానిన్ రాక

### హంగేరి సైన్యం తగ్గింపు

## దేశీయ వైద్యకార్యక్రమాలను నివేదించడానికి ప్రత్యేకోద్యోగి

### ఆరోగ్యమంత్రి ప్రకటన: యునాని హోమియోపతి నిపుణుల సిఫార్సులు

కర్నూలు, సెప్టెంబరు 7: ఆయుర్వేద, యునానీ, హోమియో, వైద్యాల ఉపయోగాన్ని బాగా ప్రచారం చేయడానికి అనుసరించతగు పద్ధతులు సూచిస్తూ ప్రవీణుల సంఘాలు చేసిన సిఫార్సులను పరిశీలించడానికి ఆంధ్ర ప్రభుత్వం త్వరలో నే ఒక ప్రత్యేకాధికారిని నియమించబోతున్నదని, ఆ అధికారి 8 నెలలలో నివేదిక సమర్పిస్తాడని ప్రజారోగ్యశాఖ మంత్రి కళావెంకట రావుగారు చెప్పారు.

యూనానీ వైద్యకళాశాలఒకటి నెలకొల్పి నాలుగేళ్ల డిగ్రీ కోర్సు ఏర్పాటు చేయాలని, యూనానీ ప్రవీణుల సంఘం సిఫార్సు చేశారు. రాష్ట్రి వ్యాప్తంగా యూనానీ, ఆయుర్వేద వైద్య బోధనాలయాలు నెలకొల్పి సమగ్రమైన విద్య నేర్పి సమర్థులైన వైద్యులను తయారు చేయాలని వారు కోరారు. రాష్ట్రి వైద్యశాఖాధికారి ...

... డానికి ఏడుగురు సభ్యులతో ఒక సంఘం నియమించాలి. ఏడాదిలోగా ఈ సంఘం నివేదిక తయారు చేయాలి.

రాష్ట్రి వైద్యశాఖాధికారి అధ్యక్షతన దేశీయవైద్య మండలి నెలకొల్పాలి. దేశీయ వైద్య వ్యవహారాల నిర్వహణకు వైద్యశాఖలో ఒక డిప్యూటీ డైరెక్టరును నియమించాలి. ఈ వైద్యం అభివృద్ధికి అనుసరించతగు పద్ధతులు సూచించడానికి, ఈ శాఖక్రింద దేశీయ వైద్య సలహాసంఘం ఏర్పాటు చేయాలి. ఔత్తరాహుల పరిభాషలోనే వ్యవహరించబడే ఓషధుల పేర్లకు ప్రాంతీయ భాషలో తగిన మాటలను ఆలోచించడానికి ఒక సంఘం నియమించాలి

### నాటు వైద్యులు

శాస్త్రం తెలియకుండా వైద్యానికి తయారైయే నాటువైద్యుల స్వేచ్ఛావిహా ...

### బస్తీలలో యునానీ ఆస్పత్రులు

### ప్రభుత్వం గుర్తింపు

### హోమియోపతీవైద్యం

### గుడివాడ కళాశాల విస్తరణ

### రిజిస్ట్రేషన్

### యూనానీ పునరుద్ధరణ

### నాలుగేళ్ల డిగ్రీకోర్సు

### బోధనా భాష

### స్త్రీలకు శిక్షణ

### దేశీయవైద్య ప్రదర్శనశాల

### పరిశోధనా సంఘం

## వికలాంగులకు విద్యాబోధన

### జాతీయ సలహా సంఘం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 8: వికలాంగుల విద్యాబోధన వ్యవహారాలను పరిశీలించడానికి భారతప్రభుత్వం ఒక జాతీయ సలహా సంఘాన్ని నియమించడానికి నిర్ణయించింది. అంగులకు, చెవిటివారికి, మూగవారికి, మానసికంగా వెనుకబడినవారికి సంబంధించిన విద్యావిషయాలలో ప్రవీణులైనవారికి, కేంద్ర ప్రభుత్వ విద్య ఆరోగ్య శాఖలయొక్క, కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థయొక్క ప్రతినిధులను ఆ సంఘంలో సభ్యులుగా నియమిస్తారు.

ఈ సలహా సంఘం ప్రధాన బాధ్యతలు:—1. చెవిటి, గ్రుడ్డి, మూగ, మానసికంగా వెనుకబడ్డవారికి విద్యాబోధన, శిక్షణ, ఉద్యోగ సదుపాయాలు, సాంఘిక, సాంస్కృతిక ప్రయోజనాల కల్పనలకు సంబంధించిన అన్ని విషయాలలోను భారత ప్రభుత్వానికి సలహాలివ్వడం, 2. ...

### పార్లమెంటులో ప్రవేశించిన కొన్ని......

### వెనుకబడిన విద్యార్థుల దరఖాస్తులు

### అమెరికా రైలు పెట్టెల దిగుమతి

## వరదలలో హరిజనుల ఇళ్లకు ఎక్కువ దెబ్బ

### వారిని పల్లంప్రాంతాలనుంచి తొలగించడానికి మంత్రి కృషి

నిడదవోలు, సెప్టెంబరు 6: రివెన్యూ మంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళి రివెన్యూబోర్డు ప్రథమ సభ్యుడు శ్రీ కె. ఎం. ఉన్నితన్, సూపరింటెండింగ్ ఇంజనీరు శ్రీ ఆర్. శివసుబ్రహ్మణ్యం, పశ్చిమ గోదావరిజిల్లా శాసన సభ్యులూ, తదితర అధికార, అనధికార ప్రముఖులతో ఈజిల్లాలో వరద ముంపుకులోనైన ప్రాంతాలు వీక్షించి ఈ సాయంత్రం వచ్చారు

తాము పెజను పైచిలుకు గ్రామాలు చూశామనీ, వరదలవల్ల ఈ గ్రామాలలో 1600 పైగా ఇండ్లకు నష్టంకలిగిందనీ దాదాపు 10 వేల ఎకరాలలో పైరు నీటమునిగి పోయిందనీ మంత్రి మా విలేఖరి కలుసుకొని అడగగా చెప్పారు.

దాదాపు ప్రతి చోటా హరిజనులు ...

| గ్రామం. | నష్టపడిన ఇళ్ళు | నీటమునిగిన ఎకరాలు |
|---|---|---|
| మారంపల్లి | 400 | 800 |
| సింగవరం | 50 | 800 |
| కంసాలిపాలెం | 100 | 800 |
| తాళ్ళపాలెం | 150 | 700 |
| నందమూరు | 200 | 600 |
| ఆరుళ్ళఅగ్రహారం | 31 | 200 |
| దువ్వ | 400 | 2500 |
| వరిఘేదు | 100 | 1000 |
| పిప్పర | — | 500 |
| అనంతపల్లి | 100 | 650 |
| మోగల్లు | 100 | 2000 |

మంత్రి ప్రతిచోటా నష్టపడిన ఇళ్లనూ, నీట మునిగిన పొలాలనూ స్వయంగాచూసి, స్థానికులు చెప్పుకొన్న ఇబ్బందులు విన్నారు. వరదబాధితులకు సహాయం తక్షణమే అవసరమనీ, శాసన సభ్యులు పూనుకొని నిధి వసూలుచేసి ఈ సహాయం సమకూర్చాలనీ విజ్ఞప్తి చేశారు. ఇళ్లు పూర్తిగా పడిపోయిన సందర్భాలలో నిబంధనల ననుసరించి ఎంతసొమ్ము ఇవ్వటానికివీలైతే అంతా ఇవ్వవలసిందని ఉద్యోగులకు చెప్పారు. కొన్నిచోట్ల పైరు నీట మునిగినా అది పాడైపోనందుకు మంత్రి సంతోషం వెల్లడించారు ఎక్కడా ప్రాణనష్టం సంభవించనందుకుకూడా సంతోషం వెల్లడిం ...

... ఈ ప్రాంతంలో మునకకు కారణమని తెలిసింది. దీనిని వెంటనే మరమ్మతు చేయించాలని ఉద్యోగులతో చెప్పారు.

### దేవాలయాల తనిఖీ

మంత్రి దేవాదాయాల కమీషనరు డిప్యూటీ కమీషనర్లతో భీమవరం, పాలకొల్లు, ఆచంట, తణుకులలోని దేవాలయాలకు వెళ్ళి తనిఖీచేశారు. వరదబాధితులకు సహాయం చేయవలసిందని దేవాలయాల ధర్మకర్తలను కోరారు.

వరదబాధితుల సహాయార్థం తమకు అప్పగించిన 60 వేల రూ॥ లు చాలకపోవచ్చునని కలెక్టరు అనగా, పరిస్థితి బాగా పరిశీలించి చేయవలసినపని ఏమిటో దానికి ఇంకా ఎంతమొత్తం ...

## ఏలూరు సాహిత్య మండలి

## రాజకీయ బాధితుల దరఖాస్తులు

## పోస్టాఫీసులలో ఖద్దరు హుండీల అమ్మకం

## హైద్రాబాదు సికింద్రాబాదుల లీనం

### ఉభయ నగరపాలక సంఘాల ఆమోదంతోనే జరుగుతుంది

# సైప్రెస్‌కు స్వపరిపాలన

## స్వయంనిర్ణయ అధికారం లేదట

లండన్, సెప్టెంబరు 6: సైప్రెస్‌కు స్వయం పాలనాధికారాన్ని పూర్తిగా కాకపోయినా, కొంతగానైనా ఇవ్వగలవని, అదిగూడా తన సార్వభౌమత్వం క్రిందనే సాగేటట్లుగా ఏర్పాటు చేయగలవనీ బ్రిటన్ గ్రీసుకు, టర్కీకి తెలియజేసింది.

ఇవాళ ఈ మూడురాజ్యాల ప్రతినిధులు కలుసుకున్న సందర్భంలో బ్రిటిష్ విదేశాంగమంత్రి హెరాల్డు మాక్మిలన్ పై రెండుదేశాల ప్రతినిధులకు ఈవిషయాన్ని తెలియజేప్పారు. సైప్రెస్‌కు ఇచ్చే స్వపరిపాలన పథకం వివరాలు ముందు ముందు పంపిస్తామన్నారు.

బ్రిటన్ 1948 లో ఒకసారి, 1954 ఒకసారి ఇటువంటి రాజకీయ సంస్కరణల సైప్రెస్‌లో ప్రవేశపెడతానన్నది గాని, అక్కడి అధిక సంఖ్యాకులయిన గ్రీకులు వాటిని ఆమోదించలేదు. వారు సైప్రెస్‌ను గ్రీసుతోకలిపి వెయ్యవలసిందిగా కోరుతున్నారు. కాని బ్రిటన్ మాత్రం అక్కడి కొద్దిపాటి స్వయంపాలనమినహా మరేమీ ప్రసాదించనంటున్నది. ఇదే విషయాన్ని మాక్మిలన్ నేడు గ్రీసు, టర్కీ యీ ప్రతినిధులకు తెలియజేశారు.

ఈ ప్రతిపాదనలపట్ల టర్కీ, గ్రీసుల వైఖరి యింకా తెలియలేదు. కానీ, అభిజ్ఞులుమాత్రం వారు ఈ ప్రతిపాదనలను తిరస్కరిస్తారని అంటున్నారు. గ్రీక్ వర్గాలు లండన్ సమాలోచనలు విఫలమైనవని ప్రచారం చేస్తున్నారు. బ్రిటిష్ పథకంలో స్వయంపాలనమే గాని, స్వయంనిర్ణయాధికారం లేదు. అది లేకపోవడం గ్రీసుకు నచ్చడంలేదు, గనుక గ్రీస్ ఈసంస్కరణలను తిరస్కరించగలదని అభిజ్ఞులు అంటున్నారు.

టర్కీకి వీటిని తిరస్కరించడానికి కారణం వేరు. సైప్రెస్‌లో 4 లక్షల మంది గ్రీకులు ఉన్నారు. లక్ష మంది టర్కీ జాతీయులు వున్నారు. ఈలక్ష మందికీ, ఆ 4 లక్షల మందితో సమాన ప్రతిపత్తిని ఇవ్వించవలసిందని టర్కీ కోరుతోంది. బ్రిటన్ అందుకు అంగీకరించినట్లు లేదు గనుక, టర్కీ ఈసంస్కరణలను తిరస్కరించవచ్చును అని అంటున్నారు.

# యుద్ధంతప్ప ఇతర మార్గాలు

## పరిష్కారాలకు అనుసరణీయం

న్యూఢిల్లీ, సెప్టెం 6: జెనీవాఒప్పందంద్వారా చేకూరిన ప్రయోజనాలను అంగీకరించి, అనుభవించిన దక్షిణ వియత్నాం, ఒప్పందంవల్ల తనపై పడేబాధ్యతలను కాదనడానికి వీలులేదని, యీ ఒప్పందానికి ఆ ప్రభుత్వం పూర్తిగా కట్టుబడి ఉందనడానికి సందేహం ఏమీలేదనీ వి. కె. కృష్ణమీనన్ ఇవాళ రాజ్యసభలో స్పష్టపరిచారు.

విదేశ వ్యవహారాలపై జరిగినచర్చలో మాట్లాడుతూ జెనీవా ఒప్పందాన్ని సక్రమంగా అమలు జరిపించడానికి దానిపై సంతకంచేసిన దేశాలూ, బలపరచిన దేశాలూకూడా గట్టిగా కృషి చేయాలనీ, ఇది న్యాయరీత్యా నైతిక ధర్మందృష్ట్యా ఆ దేశాలవిధి అనీ ఆయన అన్నారు.

గోవావిషయం ప్రస్తావించి, శాంతియుతంగా సమస్యలు పరిష్కరించుకోవాలన్నదే మన విదేశాంగనీతిఅన్నారు. ఇప్పుడు గోవా విముక్తికి, యుద్ధంతప్ప ఇతరమార్గాలు అన్ని వినియోగించవచ్చు. ప్రపంచాభిప్రాయాన్ని సంఘటితం చేయాలి. ఇదేమనం అనుసరించతగిన పద్ధతి అనిచెప్పారు.

ఆయుధ విసర్జన వ్యవహారంలో సైనిక సన్నాహాలను తనిఖీ చేయడానికి ఒక దేశంవారు మరొక దేశంలోనికి ప్రతినిధులను పంపవచ్చునన్న పద్ధతిపై ఒప్పందం కుదరడం ముదావహమన్నారు. మొత్తానికిఆయుధ విసర్జనపై ఒప్పందం కుదిరి సంతకాలు జరగడానికి చాలకాలం పడుతుందని కృష్ణమీనన్ అన్నారు.

# లోహియా పక్షం

నైనిటాల్, సెప్టెంబరు 7: ప్రజా సోషలిస్టుపక్షం సభ్యులు మొత్తం 175 వేలమందిలో దాదాపు లక్షమంది, వచ్చే నెలలో తాము ప్రారంభించబోయే కొత్తపక్షంలో చేరటానికి సుముఖత చూపారని డాక్టర్ రామ మనోహర్ లోహియా అన్నారు.

డాక్టర్ లోహియా క్రితం సోమవారంనాడు ఇక్కడ ఒక బహిరంగ సభలో ఉపన్యసిస్తూ ప్రజా సోషలిస్టు పక్షం తాలూకు 70 జిల్లాసంఘాలు ఇంతవరకూ తనపక్షానికి ఆనుకూల్యం చెప్పాయనీ, జాతీయ కార్యవర్గాన్ని బలపరిచేటి స్థానిక సంఘాలు కూడా లేవనీ అన్నారు.

అధికారంలో వున్న పక్షమూ, ఇతర రాజకీయపక్షాలూ కూడా నిరుద్యోగ సమస్యను పరిష్కరించటానికీ, దేశ దారిద్ర్యాన్ని నిర్మూలించటానికీ ఏమీ చేయలేకపోయాయనీ, కొత్తపార్టీ వీటి విషయంలో పూర్తి శ్రద్ధ వహిస్తుందనీ కూడా ఆయన అన్నారు.

రాజ్యసభ సభ్యులు శ్రీ హెచ్. డి. రాజా, ఆయన కుమారుడు శ్రీ టి. ఎస్. నారాయణస్వామిగారలు అమెరికా వెళ్తున్న సందర్భంలో మద్రాసు సెంట్రల్ స్టేషన్‌లో వారికి వీడ్కోలు చెప్పబడింది.

విజయవాడ కన్నడ సేవా సంఘం నూతన కార్యవర్గం. ఈ సంఘం ద్వితీయ వార్షిక సమావేశం మొన్న ఆదివారంనాడు జరిగింది.

ఈజిప్టు ఉపప్రధాని జమాల్ సలీం ఈ నెల 4 వ తేదీన భారతదేశం వచ్చారు. ఇక్కడ ఈయన 15 రోజులు పర్యటన చేస్తారు.

వెలగపూడి వెంకట సుబ్బారావు గారు. వీరు మైనింగ్, మెటలర్జీలలో ఉన్నతవిద్యాభ్యాసానికై ఇంగ్లండ్ వెళ్తున్నారు

# పుదుచ్చేరీలో ఎన్నికలు

## మళ్లీజరగవని ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: పుదుచ్చేరిరాష్ట్రం శాసనరీత్యాకూడా భారతదేశంలో చేరిపోయినతర్వాత మళ్లీ ఆ రాష్ట్రంలో ఎన్నికలు జరుగుతాయని ఇదివరకు తాము లోక్‌సభలో చేసివున్న ప్రకటనను విదేశాంగ వ్యవహారాల ఉపమంత్రి శ్రీ ఎ. కె. చాందా నేడు ఉపసంహరించుకొన్నారు.

ఆ విషయమై ఇప్పుడేమీ చెప్పలేమనీ, నిర్ణయమేమీ జరగలేదనీ, శాసనరీత్యా బదలాయింపు జరిగాక అన్ని విషయాలనూ గమనించి నిర్ణయించవలసివుంటుందనీ, ఈ విధంగా తమ ప్రకటనను సవరించుకో నివ్వవలసిందనీఇవ్వాళ ఆయన లోక్‌సభలో కోరారు.

## మైసూరు రెవిన్యూబోర్డు

బెంగుళూరు, సెప్టెంబరు 6: మైసూరు ప్రభుత్వం, రెవిన్యూశాఖ కమిషనరు ఆఫీసుస్థానంలో కొత్తగా ఏర్పాటు చేసిన రెవిన్యూబోర్డు సెప్టెంబరు 29 వ తేదీనుండి పని ప్రారంభించగలదని ఒక అధికార ప్రకటన వెలువడింది.

# ప్రభుత్వోద్యోగులు హిందీ నేర్చుకునే సమస్య

## దేశీయాంగశాఖ పరిశీలన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 6: హిందీ వ్యాప్తి మరింత చురుకుగా జరగడానికి అవసరమైతే, ప్రభుత్వోద్యోగులను, రోజూ తాము పనిచేసే 8 గంటలలోనూ ఒక గంటసేపు హిందీ నేర్చుకోవలసిందిగా కోరాలని రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ ఒక సూచన చేశారు. ఈ విషయాన్ని దేశీయ వ్యవహారాలశాఖ పరిశీలిస్తున్నారు.

వార్తాసౌకర్యాలశాఖ ఉపమంత్రి రాజ్ బహద్దూర్ లోక్‌సభలో వీరాస్వామిగారి ప్రశ్నకు బదులు చెబుతూ ఈ సంగతి వెల్లడించారు. తంతి తపాలా ఉద్యోగులందరూ 1965 జనవరి 26వ తేదీ నాటికి హిందీనిసగినంతగా నేర్చుకుని ఉండాలని దేశీయ వ్యవహారాల శాఖ ఇటీవల ఆదేశించింది. ఈ సంగతి ఈ శాఖ ఉద్యోగులు అందరికీ తెలియచేశామనీ, నిర్ణీతకాలంలో వారందరికీ హిందీ నేర్పే విషయమై చేయతగు ఏర్పాట్లు గురించి, తంతి తపాలాశాఖ అధికారులు ఆలోచిస్తున్నారనీ ఉపమంత్రి తెలియచేశారు. ప్రస్తుతం ఈ ఉద్యోగులు హిందీని ఐచ్ఛికంగా నేర్చుకుంటున్నారు.

శ్రీ వీరాస్వామి: భారత ప్రధాని, కేంద్ర మంత్రులు రాష్ట్ర మంత్రులూ కూడా, హిందీని నిర్బంధం చేయబోమని మద్రాసు ప్రజలకు హామీ ఇచ్చారు. ఇపుడు తంతి తపాలాశాఖకు పంపిన ఈ ఉత్తర్వులవల్ల హిందీ అభ్యాసం నిర్బంధించినట్లు అవలేదా?

సభాపతి: ఇది, మనం చెప్పుకునే అర్థాన్ని బట్టి ఉంటుంది.

శ్రీ వీరాస్వామి: మద్రాసురాష్ట్రంలోని కేంద్ర ప్రభుత్వోద్యోగులు హిందీ నేర్చుకోకపోతే వారు పై పదవులకు వెళ్లే దానికి ఈ అనర్హత ఆటంకం అవుతుందా?

శ్రీ రాజ్ బహద్దూర్: హిందీ అధికారభాష అయేనాటికి ఉద్యోగులంతా ఆభాష నేర్చుకుని ఉండాలి కాబట్టి, 1965 జనవరినాటికి హిందీ నేర్చుకోవలసిందని దేశీయ వ్యవహారాలశాఖ ఆదేశించింది. జారీ అయిన ఉత్తర్వులు ఈ తరహాలోనే ఉన్నాయి.

శ్రీ ద్వివేదీ: ప్రభుత్వోద్యోగులు పనిచేసే కాలంలో ఒక గంటసేపు హిందీ నేర్చుకోవలసిందిగా కోరాలని రాష్ట్రపతి చేసిన సూచన విషయం ఆలోచిస్తున్నారా?

రాజ్ బహద్దూర్: దేశీయ వ్యవహారాల, శాఖ దీన్ని పరిశీలిస్తూ ఉంచాలి.

శ్రీ హీరేన్ ముఖర్జీ: హిందీ వ్యాప్తికి రోమన్ లిపివాడే విషయం ప్రభుత్వం ఆలోచిస్తున్నదా?

శ్రీ రాజ్ బహద్దూర్: ఈ సంగతి ఎన్నడూ ఆలోచించలేదు.

శ్రీ అవినాశిలింగం చెట్టియార్ అడిగిన ప్రశ్నకు బదులు చెబుతూ, తంతి తపాలా శాఖ ఉద్యోగులు ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి బదిలీ అవుతూ ఉంటారనీ, కొత్త ప్రాంతానికి బదిలీ అయితే, అక్కడి భాష తెలియడం అవసరమనీ, చాల రాష్ట్రాలలో హిందీ అధికార భాష కాబోతున్నది కాబట్టి, ఉద్యోగులు ఆ భాషను నేర్చుకోవడం వాంఛనీయమనీ వార్తా సౌకర్యాల మంత్రి శ్రీ జగ్‌జీవన్‌రామ్ వివరించారు.

# ఆసియాదేశాల సమష్టిక్షేమం

## శ్రీ నెహ్రూ వివరణ

### 'తరుణంలో తగుచర్యలు జరుగుతవి'

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ ఇవ్వాళ 'శిఖరాగ్ర సమావేశం' అనే మాటను వాడటంపట్ల తమ తీవ్రఅయిష్టతను వెల్లడించారు.

పత్రికల్లో వాడుకవచ్చిన ఆ 'అసుఖమైన దురదృష్టపు' మాటలను పార్లమెంటులో వాడవద్దనికూడా ఆయన కోరారు.

ఇవ్వాళ రాజ్యసభలో శ్రీ నండూరి ప్రసాదరావు, ఆసియా సమష్టి శాంతి ఒడంబడిక చేసుకోవటంగురించి చైనా ఏమైనా ప్రతిపాదనచేసిందా అని అడిగారు.

విదేశాంగ వ్యవహారాల ఉపమంత్రి శ్రీ అనిల్ కుమార్ చాందా అటువంటి ప్రతిపాదన ఏమీరాలేదన్నారు.

చైనా ప్రధాని చౌఎన్‌లై ఈ ఉద్దేశం వెల్లడిస్తూ ఒక ప్రకటనచేసిన విషయం ప్రభుత్వ దృష్టికి రాలేదా అని మళ్లీ అడిగారు.

ప్రధాన మంత్రి దానికి సమాధానం చెబుతూ ఒక ప్రభుత్వం ఇంకో ప్రభుత్వానికి ఏదైనా ప్రతిపాదన చేసేటట్లయితే అది రాయబారుల ద్వారా జరుగుతుందిగాని ఇతర పరోక్ష మార్గాల ద్వారా కాదనీ, బహుశా శ్రీ రావు చౌ ఎన్ లై ఎక్కడైనా చేసివున్న ప్రసంగం చూసి ఈ ప్రశ్న అడిగివుంటారనీ అన్నారు. అంతేగాని ప్రతిపాదన ఏమీ లేదన్నారు.

మరి భారతదేశమేమైనా అటువంటి ప్రతిపాదన చేసిందా అని శ్రీ రావు అడగగా, 'లేదు'అని ప్రధాని అన్నారు.

అంతట శ్రీ భూపేష్ గుప్త ఆ మధ్య ప్రధాని 'ఆసియా దేశాల శిఖరాగ్ర సమావేశం' గురించి మాట్లాడారే, వారి పుద్దేశమేమిటి అని అడిగారు.

ప్రధాని గభాల్నలేచి, చాలా అసుఖమైన, దురదృష్టమైన ఆ మాటలను తాము ఎన్నడూ వాడలేదనీ, పత్రికాలోకంలో వాడుకవచ్చిన ఆ మాటలను ఈ సభలో గానీ, రెంపెవ సభలో గానీ వాడటంకూడా తనకు ఇష్టంలేదనీ అన్నారు. తాము అన్నది అసలు ఇందుకు కేవలం వ్యతిరేకమైంటిదనీ, ముందు ఎప్పుడో ఒకప్పుడు ఆసియా దేశాలు వివిధ విషయాలను ఆలోచించేందుకు కలుసుకోవాలనే అన్నామనీ, అందుకు ఇది తరుణంకాదనికూడా అన్నామనీ ఆయన తెలిపారు.

# సెకండరీ విద్యాసంఘం

## 22 మందితో ఏర్పాటు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: అఖిల భారత సెకండరీ విద్యాసంఘాన్ని కేంద్రప్రభుత్వం ఆచార్య హుమయూన్ కబీర్ అధ్యక్షుడుగా ఏర్పరచినట్లు తెలుస్తున్నది.

ఇందులో 22 మంది సభ్యులు ఉన్నారట. అఖిల భారత సాంకేతిక విద్యాసంఘం లాగా ఇది పనిచేస్తుందని సెకండరీ విద్యయొక్క వివిధ దశలను ఎట్లా నడిపించవలసిందీ ప్రభుత్వానికి సలహా ఇస్తూవుంటుందని కూడా తెలియవస్తున్నది.

ఇందులో కేంద్ర విద్యాశాఖనుంచి ఇద్దరో, ముగ్గురో ప్రతినిధులు, కేంద్ర విద్యాసలహా సంఘం ప్రతినిధులు ముగ్గురు, రాష్ట్రాల విద్యాశాఖలనుంచి ఆరుగురు ప్రతినిధులు, ఉపాధ్యాయుల శిక్షణకళాశాలల ముఖ్యాధ్యాపకుల తరఫున ఒక ప్రతినిధి, అఖిలభారత సాంకేతిక విద్యాసంఘం ప్రతినిధి ఒకరు, అంతర్విశ్వవిద్యాలయ సంఘ ప్రతినిధి ఒకరు, జాతీయాభివృద్ధి కార్యక్రమాల పరిపాలక వర్గం తరఫున ఒక ప్రతినిధి, 6 గురు విద్యావేత్తలు, మొత్తం 22 మంది సభ్యులు వుంటారు. వీరి తొలి సమావేశం అక్టోబరు 1 నాడు జరుగుతుందని తెలుస్తున్నది.

ఇటువంటి సంఘాన్ని స్థాపించాలనే సంకల్పం ఉన్నదని కేంద్ర విద్యామంత్రి మౌలానా అబుల్ కలాం ఆజాద్ జనవరిలో జరిగిన కేంద్ర విద్యాసంఘం సమావేశంలో ప్రకటించారు.

## భారతీయ భాషల పరిశోధన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 7: భారతదేశంలోని భాషలూ, వాటి మాండలికాలూ మొదలైన వాటివిషయంచి తిరిగి ఒకసారి పరిశీలన జరిపించాలని ప్రభుత్వం ఉద్దేశిస్తున్నట్లు విద్యామంత్రి మౌలానా ఆజాద్ ఇవ్వాళ లోక్‌సభలో తెలియచేశారు. ఈపరిశీలన చేయించటంలో పుద్దేశం ఆయాప్రజల గురించీ వారి సంస్కృతుల గురించి సరిగ్గా తెలుసుకోవటానికి సావకాశం కలిగించటమేనని ఆయనన్నారు.

## ఆయుధాలశాసన సవరణ

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 7: ఆయుధాల శాసనాన్ని సవరించేందుకు ఒకచట్టాన్ని ప్రస్తుత సమావేశంలోనే ప్రతిపాదించాలని ప్రభుత్వం తలుస్తున్నట్లు దేశీయాంగశాఖ ఉపమంత్రి శ్రీ బి. యన్. దాతార్ ఇవ్వాళ లోక్‌సభలో తెలియచేశారు.

ఈ చట్టం ప్రస్తుత శాసనంలోని నిబంధనలను వీలయినంతవరకూ సడలించటానికి ఉద్దేశించబడిందన్నారు. ఇందు నిమిత్తం 24 రాష్ట్రాలు సూచనలు పంపినవనికూడా అన్నారు.

మొత్తం జనాభాలో నూటికి ఒకరికంటే ఎక్కువమందికి లైసెన్సులు ఇవ్వరాదని కేంద్రప్రభుత్వ అభిమతమని చెప్పి పంజాబులో లైసెన్సులు రద్దు చేస్తున్నమాట నిజమా అని శ్రీ ఇక్బాల్ సింగ్ అడగగా, అటువంటిది తమ కేమీ తెలియదని శ్రీ దాతార్ అన్నారు.

# పాక్ రాజ్యాంగ పరిషత్తు

## సక్రమమైందికాదని దావా

కరాచీ, సెప్టెంబరు 6: ప్రస్తుత పాక్ రాజ్యాంగ పరిషత్తు క్రమమైందో, అక్రమమైందో తేల్చవలసిందిగా కోరుతూ జి. ఎం. సయ్యద్ ప్రభృతులు సింధు చీఫ్ కోర్టులో ఒక దరఖాస్తు పడవేశారు.

వీరివాదం ప్రకారం ఈ రాజ్యాంగపరిషత్తు అక్రమమైంది. పూర్వం పరిషత్తును గవర్నరు జనరల్ సవ్యంగా రద్దుచెయ్యనందువల్ల ఇది అక్రమమౌతున్నది. అందువల్ల పూర్వపు రాజ్యాంగపరిషత్తే జీవించివున్నట్లు సిద్ధమౌతున్నదని వీరు వాదిస్తున్నారు.

ఈ దరఖాస్తుదారులు రెండు అంశాలనుగురించి న్యాయాన్ని తీర్పును అర్థిస్తున్నారు. ఈ రెండు అంశాలను సంబంధించినంతవరకు ఇంజక్‌న్‌లుజారీ చేయవలసిందిగా న్యాయాధిపతిని కోరుతున్నారు (1) ఇది న్యాయసిద్ధమైన పరిషత్తుకాదు గనుక రాజ్యాంగ నిర్మాణ కార్యం ఇది నిర్వహించకుండా కోర్టు వారుచూడాలి. (2) పూర్వం రాజ్యాంగపరిషత్తు కార్యకలాపాలను, రాజ్యాంగనిర్మాణం విషయమై దానికివున్న హక్కులను ఇది అంటే ఇప్పటి పరిషత్తు భంగం చెయ్యకుండాచూడాలి.

## కాకినాడ

తమ సమస్యను పరిష్కరించడానికి మంత్రి శ్రీ చంద్రమౌళి చేస్తున్న కృషిని అభినందిస్తూ యీ నెల 1 న జరిగిన కాకినాడతాలూకా రాజకీయ బాధితుల సమావేశంలో తీర్మానించారు. ఈ సమస్య పరిష్కారం విషయంలో సహాయపడేందుకు శ్రీయుతులు మల్ల ఫణీశాస్త్రి, గోలి కేరన్న, విశ్లీ సంకట్రావు, కె. కామేశ్వరరావు, రావు అబ్బారావులతో ఒకసంఘం ఏర్పాటు చేశారు.

# శిక్షలకు పాతనేరాలేసాక్ష్యమా?

## విచారణ ప్రహసన కారాదని హెచ్చరిక

రాజమహేంద్రవరం, సెప్టెంబరు 8: పాతనేరస్థునిపై మరొక అభియోగం విచారణకు వచ్చినప్పుడు, అతని తరఫున వాదించేవారు లేనప్పుడు న్యాయస్థానాలు సాక్ష్యాన్ని మరింత జాగ్రత్తగా పరిశీలించి, సాధ్యాసాధ్యాలను జాగ్రత్తగా ఆలోచించి నిర్ణయాలకు రావాలనీ, విచారణ ప్రహసనం స్థాయికి దిగజారకుండా జాగ్రత్త వహించాలనీ, నిందితుడు పాతనేరస్థుడైనప్పటికీ మిగతా పౌరులవలెనే అతనికీ శాసనరక్షణ వున్నదని గుర్తించాలనీ తూర్పుగోదావరిజిల్లా న్యాయమూర్తి శ్రీ టి. హెచ్. ఎం. సదాశివయ్య ఒక అభియోగంలో తీర్పు చెబుతూ అన్నారు.

ఈ అభియోగం అనూరు వాస్తవ్యుడు శ్రీ పసుపులేటి సూర్యచంద్రరావు కాకినాడ అడిషనల్ ఫస్టుక్లాసు మేజస్ట్రేటు తీర్పుపై చేసుకొన్న అప్పీలుకు సంబంధించింది. శ్రీ సూర్యచంద్రరావు ఒకని సైకిల్‌ను అపహరించి అమ్ముకోబోయాడని అసలు అభియోగం. ఆమాట నిజంకాదనీ, తాను ఆ సైకిల్‌ను ఆ వ్యక్తి వద్ద నెల సరి బాడుగకు తీసుకొన్నాననీ, అందుకు తాను బాడుగ చెల్లించినట్లు దాఖలా కూడా వున్నదనీ, తాను పాతనేరస్థుడగుటచేత ఈ అభియోగం తనపై బనాయించారనీ శ్రీ సూర్యచంద్రరావు వాదం. కాకినాడ మేజస్ట్రేటు ప్రాసిక్యూషన్ వాదం ఆమోదించి శ్రీ సూర్యచంద్రరావుకి శిక్షవిధించారు. దానిపై ఆయన అప్పీలు చేసుకొన్నారు. సెషన్స్‌జడ్జి పైన తెల్పిన విధంగా విమర్శించి సూర్యచంద్రరావుకి విధించిన శిక్షను రద్దు చేసి, ఆయనను విడిచిపెట్టారు.

## రాజోలు తాలూకా కొబ్బరిచెట్లకు చీడ

రాజోలు, సెప్టెంబరు 4: రాజోలు తాలూకాలో కొబ్బరిచెట్లకు కొక కొత్త చీడవచ్చింది. ఈ చీడవల్ల కొబ్బరిచెట్ల ఆకులు చెడిపోతవి. కింది ఆకుల చివర్లు పసుపుపచ్చ రంగులోకి మారిపోతవి. గ్రూనుకూడా దెబ్బతింటుంది. కాయలు సరిగ్గా తయారుకావు. అందువల్ల కొబ్బరితోటలకు చాలానష్టం. బాపట్ల వ్యవసాయ కళాశాల నిపుణుడు పి. గోవిందరావుగారు ఇటీవల ఇక్కడికి వచ్చి కొన్ని గ్రామాలలోని కొబ్బరి తోటలను పరిశీలించారు. రాజోలు వృక్షశాస్త్ర పరిశోధన కేంద్రం నిపుణుడు శ్రీ ఎడ్విన్ ధర్మరాజు సహాయంతో ఈ వ్యాధి వివరాలను శ్రీ గోవిందరావు సేకరించారు.

## ఆదోని, గుంటూరు తాలూకాలలో పంటలకు చీడ

కర్నూలు, సెప్టెంబరు 8: గుంటూరు తాలూకాలో వేరుశనగ పంటకు, కర్నూలుజిల్లా ఆదోని తాలూకాలో వేరుశనగ, జొన్న పంటలకు చీడపట్టినట్లు గత జూన్ 30 తో అంతమైన పక్షం రోజులలో పంటల స్థితిగతులపై వెలువడ్డ ప్రభుత్వ నివేదిక తెలియచేసింది. ఆదోని తాలూకాలో పంటకు గొంగళీ పురుగు పట్టిందట. ఈ చీడను నిర్మూలించడానికి ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నది. రాష్ట్రం మొత్తంమీద పంటల స్థితి బాగానే ఉన్నట్లు ఈ నివేదిక తెలిపింది.







Printed and Published for Nageswara Rao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6&7 Thambu Chetty St., Madras-1. Editor S. Sambhu Prasad.